# కదంబము

(పద్యకావ్య సంపుటి)

కవిమిత్రులు

*



నవ్యసాహిత్య పరిషత్తు

గుంటూరు

# స మ ర్ప ణ ము

*

దేశోద్ధారక, విశ్వదాత,

వీరమాహేశ్వరస్వరూప

శ్రీ కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారికి

*

# ఒక మాట

ఈ కదంబము రచించిన కవి మిత్రులు నలుగురూ మా నవ్యసాహిత్య పరిషత్తులో సభ్యులు. ఇద్దరు బి. ఏ. పూర్తిచేశారు. ఇద్దరు పూర్తి చెయ్య నున్నారు.

ఈ రచన వీరి ప్రథమ ప్రయత్నము.

కాకినాడలో జనవరి ౨౬ తారీఖున జరిగిన నవ్యసాహిత్య పరిషత్సమావేశానికి నాగేశ్వరరావు పంతులుగారు దయచేసి స్వస్తి రూపకంగా గంభీరోపన్యాసము చేసి, నవీన కవులకు మహోత్సాహం కలిగించారు.

ఆనాడు ఈనవ్యకవులు నాగేశ్వరరావు పంతులుగారికి "కదంబము" సమర్పించారు. పంతులుగారు పరమప్రీతితో స్వీకరించి, కవులను ఆశీర్వదించారు.

తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి

రాజమహేంద్రవరము
మార్చి: ౧౯౩౬

# వెన్నెలరేయి

నిండు చందురు హృదయంబు పండువెన్నె
లగ కరంగి పాల్కడలియై గగన మెల్ల
యెడల వెల్లివిరిసె, నంత కడలిరాజు
పొంగినాడిట నానంద పులకితుడయి.

వెన్నెల పసందు, జలధి గంభీర గాన
మాత్మ కొక నూతనానంద మలర జేయ
నచటనే యాపులినశయ్యయందె సుఖము
గా నిదురవోయినాడ నొక్కడనె నేను.

అంత నొక సుఖస్వప్న నీలాంబరమున
ఇందు బింబమ్ముగా నుదయించినావు
నాథ, ప్రేమజీవన రాశినై కరంగి
పొరలి నీపదమ్ములదాక పొంగినాను!

# తీయని తలపులు

లలిత హాసవిలాస ఫుల్లాబ్జముఖుడు
మన్మనోనాథు డిప్పుడే మామకీన
కోమల హృదయ నిష్యంది ప్రేమ మధువు
క్రోల నరుదెంచు వేళ కాబోలు నిద్ర.

ప్రకృతి కాంతామతల్లి సత్ప్రణయగీతు
లాలపింపగ బంపిన లలన లనగ
గాన మొనరించు విహగవితాన మిపుడు.

ప్రాగ్దిశాంగనా మృదుకర పల్లవములు
మోహనారుణశోభచే ముదము గొలుపు
నెంత పారాణిచేసెనో యీ ప్రభాత
మున సఖుని చరణముల పూయనగు ననుచు.

ఇచట కల్యాణవేదిపై నెంత చక్క-
గా ప్రసారించు నావిభాకరుడు తనదు
లేతకిరణాలు, బంగారు పూత పూసి
నేడు నాసఖు నలరింప నెంచెనేమొ.

అచట సువిశాల పశ్చిమాశాంతరమున
ఆ మహేంద్రచాపమ్ము నేయమరవనిత
కర కలిత మృదుకుంచికా విరచితమ్ము
రంగు రంగుల తోరణాల మరపించు.

నవయుగోదయ మిప్పుడు నాదు నడుగు
సందడులు విననయ్యె నమందగతిని
మ్రోయు సన్నని నాగుండె మ్రోతలోన
.......................................

ఏమిటికి విడంబింతు వోయీ, వినూత్న
ములు మనోహరామోద సంయుతములు నగు
పూల నెంచి రచించిన మాల యిదిగో!
ప్రేయసీ కంఠసీమ కై సేయు మోయి!

# వలదు

ఈ యనంత విషమ దాస్యమే భరింప
జాల - దివ్యాతిదివ్య స్వేచ్ఛాప్రపూర్ణ
మతిని - సీ ! బానిసీలలో మను మటంచు
నాజ్ఞ యిడ నేల నోయి దేవాదిదేవ !

సదమలానంద సామ్రాజ్య సార్వభౌము
నీ బహుళ దుఃఖమయభూమి నేలు మనుచు
ముదల యిచ్చు టేల మహాప్రభూ, వహింప
ఈ జడజన ప్రపంచైక రాజ పదవి !

# స్తబ్ధవీణ

నాడు నీపాడినట్టి గానమ్ములోన
ఒలికిపోయెను మధుర పీయూషలహరి
పల్లవ ప్రసూనములతో ప్రకృతియెల్ల
స్నిగ్ధముగ్ధమై జలదరించినది యపుడు.

జలదముల దాటి, వ్యోమవీథులను మించి
ఉడుపథమ్ముల నొక్కెడ గడచిపోయి
నీదుకోమల కలగాన నిస్స్వనములు
కలిసిపోయె నశ్రుత దివ్యగానకళల.

క్షణికముగనే సమసిపోవు సాంధ్య శోభ
యటుల నట్టె శ్రవణపేయమై వెడలిన
దెటకొ యరయరాని రహఃప్రదేశములకు
నీదు కమనీయగాన నిర్నిద్రరవము.

సలలిత హృదయవీణ తంత్రులు నడలెనొ
తన నిగూఢాను భూతగీతముల నెల్ల
జనములకు వినిపింప నొల్లని కవివలె
నీవు లోలోనె పాడుచున్నావొ యేమొ!

# సత్కవీ !

తావక హృదయ నందనోద్యానమందు
విరియు భావలతాంత వితతి ప్రణయ
పూజకో యెండవానలపోటు కోర్చి
జగము బోషించు జీవకర్షకుని కొరకొ.

గండుగోయిల గుంపుల కలనినాద
ముననో, అనుకంప గోరు ప్రస్ఫుట దరిద్ర
మానవార్తనాదమ్ముననో నదించు
నీ హృదయవీణ యమర సంగీతరవము.

ప్రణయయాత్రాపరుల శిథిల ప్రణయమె
తలచి వారిగోరీల పజ్జలనె నిలతు
వశ్రుబిందు సందోహంబు నంజలించి;
భూరుహచ్ఛాయ నిలిచి వాపోవు, నదిగో
జాలిగా వచ్చి బాలెంత రాలు: విడువ
వాయనాథకునై యొక్క యశ్రుకణము !

విశ్వకల్యాణసూత్రమే ప్రేమసూత్ర
మే యగును, తథ్య మోసత్కవీ, అణువు న
జాండ మొక్కటిగా గనజాలు నపుడె.

# పూజ

పూజలట, పూవులట, పటమ్ములట, దీని
కేమి నోములే యన్నవా రిరుగు పొరుగు
వారు, రాతిగుండెలు గలవారు గాన;
కాన బో మనుకంప యొకళ్ళయందు.

లోకు లుద్విగ్నమతులు, పో రొక్క గతిని.
పట్టి నాటక మనిరి మత్ప్రాణనాథు
నాత్మశాంత్యర్థ మే జేయునట్టి పూజ:
ఇంతలోకమ్ముకను మూయ నేల నాకు!

# ఏకాంతమున

నాకు విస్తృతవ్యోమయానమ్ము వలవ
దనుచు కోరి యీ యుపలకుడ్యావృతాంధ
కారబంధుర మందిర గర్భమందు
ఓ విభూ, నిన్నుపాసించుచున్నవాడ !

బంధముల ద్రెంచుకొని లోకమందు జేరి
యిచ్చవచ్చిన తెరగున విచ్చలవిడి
గా నడాడువాని కెచట గానబడును
చిత్తశాంతి, మరింతగా చెడునుగాని.

భవమహానంత సాగర ప్రచలదూర్మి
సంగత మనోజ్ఞహృదయపుష్పంబు లరయ
రేకు లూడి సుడుల నధోలోకమునకు
పోక నిండుగా విచ్చి తావుల నెనయునె ?

ప్రాఙ్నగాన విరియు నుషఃప్రభల గనిన
శాశ్వతము కాని సంజకెంజాయ గనిన

రాగ మొందునె కాని, నేరదు మనమ్ము
గుణరహితుడైన విశ్వాత్ము గణనచేయ.

నిశ్చల తపస్సమాధి మాని నరు డొంద
జాలునే యాకులం బైన జగమునందు
తన యొనర్చిన యపరాధతతులు సమయ
నొక్కయింత పశ్చాత్తాప మోయినాథ!

కడుగుకోజాలునే మనఃకల్మషమును
ఏఱులై పారు వేడికన్నీరు లేక?
కలుగునే యొక్క కన్నీటికణము గాని
చిద్విలాస, నీ యేకాంతసేవ లేక?

నీ పదాంభోరుహములు ధ్యానించుకొనుచు
క్రుగ్గి క్రుగ్గి యీ యంధకారమ్ములోనె
నన్ను మరణింపనిమ్మోయి నాథ, బంధ
నమ్మె స్వేచ్ఛాప్రపూర్ణపదమ్ము కిమ్ము!

894.8131 కవిమిత్రులు, త్ర.
KAV

కదంబము. గుంటూరు, నవ్యసాహిత్య పరిషత్తు, 1932.

47 పు.

కదంబవరం, 1932.

కవిమిత్రులు, త్రై.

# తాండవ దేవత

ఏను రాజాధిరాజును : ఈసమస్త
భూవలయము నాసామ్రాజ్యమున గలట్టి
ఒక్క పరమాణువు తలంప, యుగ యుగాలు
వేలు గడచిపోయినవి నాపాలనమున.

ఈ చరాచర జగ మెల్ల నేలుచుంట
రాజరాజాధిరాజ విరాజమాన
చక్రవర్తి కిరీట ప్రశస్తరత్న
పుంజముల కాంతి నాపాదములనె నిలుచు.

అప్సరోంగనా నివహ గానామృత రస
సేచనమ్మున పల్లవించి కుసుమించి
న సురవిటపి వనాళులు నాయనంత
రాజ్యమందున యెల్లవాడలను కలవు.

నా విశాల సామ్రాజ్యమ్ములో విధాత్ర
డాది గలవారు క్రీడింతు రనుదినమ్ము

లోకములు పదునాల్గు ప్రభా కలిత వి
లాసలాస్య కేళీసీమలై యెసంగ.

నేను పారిజాత కుసుమా నీకమున ము
నిఁగి పోనొల్లను. సుగంధ నిస్తుల సుమ
నోజ్ఞ కుసుమ పరాగ రేణువుల మైన
లందుఁకో నొల్ల, మేలైన విందు లొల్ల.

అమర దేశాటనమ్ము ప్రియమ్ము కాదు
భూతములు చరించెడి ప్రేత భూమివోలె!
దివ్య భూషాంబరమ్ములు తేజ మిడవు
మోదమును కాంతి నొసగు విభూతి వోలె:

అరయ భిక్షాటనమ్ము ప్రియమ్ము నాకు.
పరమ భక్తిని నాయీకపాలమందు
ప్రియముతో నిడు ముద్ద తృప్తి దినునట్లు
యాగ భాగమ్ములను గూడ నాహరింప.

స్వేచ్ఛ నశియించినట్టి జీవితము గడపు
వారు నీచాతినీచ జీవచ్ఛవములు
పొడము చున్నారు నారాజ్యమునను గూడ.
వారు క్రుంగి క్రుంగి నశింప, పాపభరిత
లోకవితతి రూపరు నటులు పొనరింతు
ప్రళయ తాండవ కేళి నవారితముగ.

# కల

కన్నీటి చిను కొకటి
క్రింద బడి చిటికినది
పెదవి రేకుల మీఁద
పద మొకటి మెదలినది.

చిరదాస్య కాఠిన్యశృంఖలా నిచయమే
సీమ సీమాంతాలకో చెదరి పోయినది.

ఉదయ కాంతుల పసిడి
తీ గొకటి మెరసినది;
మృదు పుష్ప గర్భమున
రే కొకటి విరిసినది.

హృదయనాళ కవోష్ణరక్త ప్రవాహాలు
పొంగెత్తి యణు వణువు
పులకించి పోయినవి!

# వసంతక్రీడ

వలపు నెగజిమ్ము పూలవెన్నెలల రేయి
తొలివసంతోత్సవమ్ములో పులకరించి
కాంతి కళ లీను మధుసమాక్రాంత మైన
లలితలావణ్య సౌందర్య లక్ష్మివోలె.

ఈ విమల వసంత విభావరీ విలీన
సుప్తమార్గాన కలికి నాజూకు గాలి
నడకలందు కల్యాణ గాంధర్వ గీతి
నిపుడు మోహనమ్ముగ వినిపింతు రెవరు?

పూవుటత్తరు లొలికిన యీవసంత
శర్వరీకాంత చలిత పక్షానిలమ్ము
నందు అమృతగీతీ నిస్వనాల కౌగి
లింతల బ్రతుకులోన త్రుళ్ళింత లాడి.

నవ్య మూకళా ప్రావరణమ్మునుండి
మనసు చిగురించు పూలవాసనలనుండి
తొలగునా నిశా కాంత వెన్నెల చెరంగు
లీకనుల కొకపసిడి కలయేని లేక ?

ఏ నొకంచ విషాదమే లేని కాంతి
సీమల మధుర మంగళ శ్రీలలోన
శర్వరీసతితోడ హస్తములు కలిపి
సలుపుచుందును నిత్య వసంత కేళి.

## సిద్ధి

ఇచట పండించు కొన్నారు ఋషులు తమ స
హస్రయుగ తపోనియమమ్ము, లలవరించు
కొన్న దిచట ప్రకృతికాంత, కుసుమ సుప్ర
సన్న సౌరభముల నమృతశాంతి కొంత.

ఇపుడు పండించు కొన్నవా రెన్నోయుగ యు
గాల స్వర్ణస్వప్నాంకిత కాంక్షఁ కవులు
వలపు రేక విరియు పరిమళము లీ య
నంత విశ్వమును కళామయ మ్మొనర్చి.

# తెలుగు సీమ

తెలుగులవేడి నెత్తురులు
తేరిన కమ్మనితేనె వాకలన్
బలికెను కోయిలల్ చెదరు
పాటలు మూగగళాల నంతతోఁ
తెలుగులపోటు సత్తి వెలి
తిన్ బడిపోయె ఫిరంగి దెబ్బకున్
తెలుగుల కోటగోడలు ప్ర
తీవ్రప్రతాప విశేషదగ్ధముల్.

కాబోలు నివ్వి దగ్ధాంధ్రరాజ్యాఖండ
తేజోమహాసభోద్దీపితములు
కాబోలు నిది మ్లేచ్ఛ ఖరఖడ్గధారా ప్ర
శస్త్రిలో తెలుగు మాంసంపు జిడ్డు.
కాబోలు శత్రుభీకర మైన తెలుగు రా
జుల పాడు కోటగోడలును నివియె.
కాబోలు నివి తెన్గు కవితాధిరాజ్య ద
గ్ధావనీజనిత ధూమాంబుదములు.
మా తెనుంగు వీరుల పౌరుషాతిశయ న
దీతరంగాభిషిక్త యీ తెనుగు సీమ

మరల నీనాడు బాష్పాంబు మగ్న మిద్ది
తోచె నెపుడు తెనుగుసీమ తోకచుక్క.

అమరె నెచ్చోటపూర్వాంధ్ర సామ్రాజ్యేంది
రాశోభ చంద్రికా రమ్య కాంతి
విరిసె నేవీట కవీంద్రుల యమృత లే
ఖినులందు తీయని తెనుగు కవిత
వెలిగ నేదివ్యసీమల తెల్గురాజు కి
రీట మాణిక్య మరీచితతులు
ఎందు గోదావరి యిల్లాలు మా తెల్గు
తరుణుల గూడి గీతములు పాడె
అది మహాపుణ్యసీమ మా యాంధ్రభూమి
దివ్య యువతులుగూడ కీర్తించుకొన్న
పావన తెలుంగుసీమ మా భాగ్యరాశి
అందె రాల్చితి నేటి కుష్ణాశ్రుకణము.

సిగ్గుపడలేక తలయెత్తి చెప్పలేక
జరిగిపోయిన పూర్వాంధ్ర చరిత కొరకు
ఇంత వేడికన్నీరు స్రవింపనట్టి
తెలుగు వీరుడు లేడు మా తెలుగుసీమ!

# గాన తృష్ణ

నేను నా కొరకే వరించితిని విశ్వ
వైణికు నమృత గాన కల్యాణగీతి.
నా బ్రతుకె గాల్పు వేడిమంటల ననంత
బహుళ బాధాపథాల తపస్వి నగుచు.

గాలి పడుచుల తేనెకంఠాల పాట
వెండి వెన్నెల సొనల స్రవించు విశ్వ
మంగళకళారవమ్ము మధురాంగణమున
జీవితపు పూవునే వికసింప జేసె.

అమల మధుమాస ప్రకృతి వయస్వినీవి
లాస పుత్రిక కోయిల ప్రణయగాన
శీతలమనోజ్ఞ మధురస సేచనమున
జీవితము నవజీవన స్నిగ్ధ మయ్యె.

పూవు టూడిలోనె పులకించిపోవు తేటి
చలువ పాటలే సోనలై జాలువారు
వెలది వెన్నెల కౌగిళ్ళ వలపు వాన
నలతరంగాలు పైపైకి విరియబోసి.

అంతమే లేని గాన తృష్ణాతి రేక
మడగిపోలేదు నాటి వాంఛలును కలవు
ఆ విచిత్ర భావాల తారాడు బ్రతుకు
పరిమళించును గాన లవమ్ము లోనె.

# ఉషః కీర్తన

అవతరింపుమ యో ఉషోహాసినీ, వి
లాస భాసుర కళల కల్యాణి, కవికు
మార భావగీతాస్నిగ్ధ మధురమూర్తి,
జన్మ జన్మల ప్రణయమే జలదరింప.

తెలుగువీణెను మృదులతంత్రుల కదల్చి
నవ్యగీతాల కమ్మదనాలు రేపి
ఉదయరాగ విస్ఫూర్తిలో మృదులమృదుల
నూత్న కుసుమ దళాలలో నొదిగి పోదు.

ఆయుషస్సుధా మధుర సీమాంత మందు
నాకళా పూర్ణ దివ్య సంధ్యార్చనముల
వేచియున్నది తలిరు జీవిక కళాపి
పాసి సౌందర్య జీవన మనుభవింప.

# దివ్యదర్శనము

స్వామి, భవదీయ దివ్యదర్శనముకొరకు
కాచికొనియుండ యుగములు గడచిపోయె.
ప్రాంగణమునుండి నేను మహాపరాధి
హీనకులజుడ నంచు గెంటించినారు.

కన్నుగానని కారుచీకటులలోన
అడుగడుగునకు నాస సందడులు సేయ
చిత్త మిగురింప నటకు వచ్చితిని గాని
నీ భవన కవాటములు బంధింపబడియె.

మధురమోహనమూర్తివి మంగళ స్వ
రూపివి సహస్రమార్తాండరోచి వీవు
ఏ దివాంధ జీవినో కాని యెట్లు చూడ
గల్గుదును నీ మనోహర కాంతి దేవ!

అహరహ మ్మిమ్మాయవనిమీద నాకసమున
నఖిల దిక్కులలో నంతరాంతరమున
నిన్ను గనుగొనువారి నిర్నిద్ర దివ్య
వీక్షణమ్ముల దయసేయ వేల నాకు!

నీ పెదవి చిరునవ్వు వెన్నెల వెలుంగు
నను నిదురనుండి మేల్కొల్పె నాథ, నీ య
పూర్వ తరళ కాంతులలోన పులకితుండ
నై నిలిచిపోతి నేయుపాయమ్ము లేక.

అమృత తేజస్వి, నీ కుపాయన మొసంగ
తళుకు లీనెడు ముత్తెపు సరులు లేవు.
అందముల జిల్కు విరిదండయైన లేదు
ప్రేమ తోలుఁకాడ చేయి చాపితిని గాని.

కాన్క యే మిచ్చు నీ బిచ్చగాడు నీకు
నిండు హృదయంబు నొక్క కన్నీటిచుక్క
కన్న! ఇవియె నే నొసగు భాగ్యములు నీకు.
ఆదరింతునో కాక యనాదరింతో!

# ప్రళయ రుద్రుడు

నా కసహ్యా జనన మరణములు లేవు.
ఆ యగమ్య తమః కుహరాంతరమున
సంతత ప్రశాంత భయదశ్మశాన సీమ
ప్రళయ నాట్యలీలా నటరాజు నేను.

నారహోనాట్య కటక నినాదమునకు
నిఖిల వార్ధులు గిరులు ఘూర్ణిల్లిపోవు
నాకుపిత నేత్ర సంజాత భీకరాన
[illegible]మున మానవావళి మాడి కుమిలిపోవు.

చండ భాస్కర ఖరకర జ్వాల నాకు
సమయకాల నాట్యోత్సవ సమయమందు
ప్రియసఖి విలయకాళి యర్పించుకొన్న
రమ్యకర్పూర దీప నీరాజనమ్ము.

## శోకగీతి

ఎడద సుడివెట్టు నీబాధ యేల నాకు?
ఇది పురాకృత కర్మమ్మొ యేమొ కాక
వ్రాసికోనీదు బాధాహరమ్ము లైన
రెండు పద్యాలనేనియు ప్రియముతోడ.

విశ్వము వసంత యౌవన విలసితమ్ము
ప్రకృతి ప్రత్యణు నవజీవ మధురిమమ్ము
నేనె మిగిలిపోతి నిశీథినీ రహస్సు
షుప్తి జీవిత స్పృహ లేక శోకదేవి
కౌగిలింతను నిలువెల్ల కరగిపోయి.

విశ్వమున కిదె నాతుది వీడుకోలు
ఈ నిరాశాప్రపంచాన నీ మహా వి
షాద నిస్పృహావీథి స్వేచ్ఛావిహీన
విషమ కలుషాంధవనుల జీవింపలేను.

తెలియరాని వెవో మహాతీవ్రవేద
నానలజ్వాల లెదుట భయంకర తమో ని
శీథినీ మేఘములు వెన్క జిమ్ముకొనుచు
ప్రాణవాయువె పీల్చగా లేని దశను
నన్ను కృశియింపజేయు… …

హృదయబాంధవివలెనె నన్నే వరించి
వచ్చితివి శోకదేవి, యాహ్వాన మిదిగో!
ఇంక గొనిపొమ్ము నిబిడాంధ మృత్యువీథి
దరులు లేని యగాధ పాతాళములకు.

# నిరాకరణము

"హిమగముపై నుంటి
ఇలుత్రోవ గనకుంటి
ఎదుట నొ॒క వాల్గంటి
నిట్లె నే కనుగొంటి!

"ఆమె కనుపాపలో
అళులు నర్తింపగా,
ఆమె కనుబొమలపై
అహియుగం బాడగా
చెక్కిళ్ళు గుంటవడ
చిరునవ్వు కానబడ
నను జేరి తన చేయి
నామీద వైచినది!

"ఒడలు పులకింపగా
ఊహ పలికింపగా
ఎవ్వతెవు నీ వంచు
నే నామె నడిగితిని.

"'నీ కాపులో నుందు
నీచూపులో నుందు
నీతలపులో నుందు
నీ వలపులో నుందు
నే వరూథిని యనెడి
నెలతుకను - నీ సఖిని!

న న్నెరుగకుందువా?
నాదు మానస చోర!"

"'నిత్యాగ్నిహోత్రి నా
నే ప్రవరు డనువాడ.
ఏకపత్నీవ్రతుడ,
ఎ ట్లెరుంగుదు నిన్ను?
పరసతివి నీ విట్లు
భాషింప జెల్లునే?'

"'నాథ, నా పల్కులను
నమ్ముమా యొక్కింత
నీ పాద మాన!—నే
నిజము పల్కెడిదాన

అమరకన్యను గాని
అన్యకాంతను గాను
నిను గాక యితరులను
నేను వలచి యెరుంగ!
ఏలుకొనుమీ యింక
హృదయేశ్వరా, నన్ను!'

"'ఏకపత్నీవ్రతుడ
నే బ్రాహ్మణుడ గదా.
నీ మగలు పెక్కండ్రు
నీవు వేశ్యవుగదా.
ఇంతి, యిటు మాటాడు
టేటి న్యాయము నీకు?'

"'సుందరా, నామన
స్సును హరించితి వేల?
నను దాసిగా జేసి
కొనకున్న మనజాల!
మనసిజుని బాధ కో
ర్వనిదాన! నీ దాన!

పాలింపవా యింక
ప్రాణేశ్వరా, నన్ను!'

"'పున్నెంపు ద్రోవలో
పొరపాటు పడబోకు
పరభామలను మాత్ర
భావంబుతో గాంతు.
పాడియా నీ విట్టి
పలు కాడు టోయింతి!
తెరువు చూపింపుమా
అరుణాస్పదము పోదు!'

"'ఏగుటే గణ్యమో
ఏలుటే పుణ్యమో
కఠినమానస, నీకు
కనికారమే లేదు!
నిన్నే తలంతునే
నిన్నే సేవింతునే
నే ప్రేమరాశినే
నీపాద దాసినే!'

"అనలంపు టూర్పులో
ఆచాన మూర్ఛిల్లె
అదియె యదనుగ నెంచి
అరుణాస్పదము బోతి."

# మేలుకొన వేల!

మేలుకొన వేల ప్రియసఖి! మేలుకొనుము!
కడచినది రేయి, పానుపు విడిచి లెమ్ము
పవలుకూడ నిద్రించిన పనులు చెడవె?

త్వరగ లేచినవార లందరకు పసద
నంబుగా నీయబడియె రత్నాలసరులు.
కోలుపోతివిగా ముద్దరాల వగుట
బహుమతుల నెల్ల నో వెర్రిపడతి, లెమ్ము!

వేయ లేదొక్కసారియు విభునిశయ్య,
సలుపలే దొక్కమారైన సఖుని సేవ
చిన్నతనపు జేష్టలలోనె జీవితంబు
కాలమును వ్యర్థముగ నీవు గడపినావు!

కాంతుమోమైన నెరుగని కారణమున
జారినది వ్యర్థముగ నీదు జవ్వనంబు!
శూన్య మైనది నీశయ్య, చూచికొమ్ము!
మేలుకో సఖి, యికనైన మేలుకొనుము!

# ప్రబోధము

జీవుడా, ఏల కనుగొన వీవు నన్ను ?
నేను నీ ప్రక్కనే యుండగానె యిట్లు
మతములం బడి నాజాడ వెతక నేల ?

హిందువుల గుళ్ళు కావు నా మందిరములు
తురకల మసీదులందు నే దొరకబోను.
కాశికాపురి నాగృహాంగణము కాదు,
కాదు మక్కాపురంబు నా కాపురంబు.

ముడుపులకు మ్రొక్కుబడులకు మోముజూప.
నిజముగా నన్ను జూడ యత్నింతువేని
చెంతనే యున్న నను నీవు చేరగలవు.
మేలుకొన వేమి జీవుడా, మేలుకొనుము !

# ఖండితయామిని

బహుళయామినీ ఖండితనాయిక
ప్రవాసచింతను కృశాంగి కాగా
హృదయాకాశం బతివ్యథ చెందగ
కవోష్ణదుఃఖము తొలకరిలాగున
కరిగి పారినది గ్రీష్మకాలమున.

చీకటి కేశాల్ చిందరవడగా
తారక సుమములు జారిపోవగా
తరుణ భాస్కరుని హాసముకోసము
వేచియున్నయది వేసరిపోవుచు.

# సృ ష్టి

మరణ మంటూ లేకపోతే
మనిషి కేమీ తెలియ దోయీ
పూర్తిగా జీవనము తెలియుట
కా ర్తి అవసర మోయ్!

అంధకారము లేకపోతే
అమృతరోచికి ఎదురు చూస్తూ
ఎవ్వ రుంటా రోయ్
మానవు లెవ్వ రుంటా రోయ్!

స్వర్గలోకం సృష్టి చేస్తూ
దుఃఖ మంటూ ఉంచకుండా
వెర్రి శిల్పి చేసినా డోయ్
సంతలోకాన్ని!

# దేవత

కాలయామిని ప్రియునికొరకై
గాసి జెంది వినీలకుంతల
జాల మవనీస్థలికి జారిచి
నావలెనె యేడ్చున్.

బ్రదుకు భారము బహుళ మయ్యెను
క్రుంగిపోయె మదీయ దేహము
ఆశయే నిరుపేదగుండియ
నశె సిలువంగన్.

సుప్తి జెందితి కఠిన కర్కశ
ఫలకభాగముమీద రేయిని
కన్గొలంకులనుండి యశ్రువు
లూట లూరంగన్.

కమ్మతావులు కొల్లలాడిన
కమ్మ నౌ పవమాన వీచియు
ఇంపు లొల్కెడు నిండు రుచియును
ఏర్చె హృదయంబున్.

నన్ను గాంచుచు జాలి నొందుచు
కర్ణికార ప్రసవ రాజియు
మాలతీలత, పారిజాతము
వాడిపో సాగెన్.

కాలమేఘచ్ఛన్న మామక
హృదయ గగనమునందు దీప్తుల
సదయమతి వై యింక నెన్నడు
తేజరిల్లెదవో !

# అనుతాపము

చిర వియోగానల పరితప్త మీయెడద
సంతత త్వచ్చింత నానంత మీ యెడద
సంవృద్ధరాగ సుధాపూర మీ యెడద
నీకొరకె నానాథ
నీరాకకై యిపుడు
వేచియున్నది ముగ్ధ
వేసారి పోవుచును.

ఈకటికి చీకటిని
చిక్కిపోతిని నాథ,
దారి తెన్నూ లేక
దిక్కు మొక్కూ లేక.

ఆశాప్రదీపమ్మె ఆరిపోయెను నాథ
జీవిత ప్రసవంపు చెన్ను తరిగెను నాథ

అమరులు నీ మీద
అమృతవర్షము కురియ
దుందుభి ధ్వానముల్
దిక్కు లెల్లెడ మ్రోయ
జయ జయరావముల్
సకలాశల న్నిండ
దివ్య తేజము నిఖిల
దిక్కులన్ వ్యాపింప
రమ్ము ర మ్మో ప్రభూ
రమ్ము శీఘ్రమ్ముగా.

నవ్యసాహిత్య పరిషత్పక్షమున ప్రకటించే త్రైమాసి పత్రిక. సరసములూ, సభ్యములూ అయిన ఖండికలు గేయములు, నాటికలు, కథలు; భాషాసారస్వతవిషయ ములు పరిశోధన చేసి వ్రాసిన వ్యాసములూ; గ్రంథ విమర్శలు మొదలైనవి ఈపత్రికలో ఉంటవి.

సంవత్సరపు చందా రెండు రూపాయలు.

---

ఇతర పద్యకావ్యములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| దివ్యలోచనములు | ... | ... | 0 | 12 | 0 |
| వకుళమాలిక | ... | ... | 0 | 8 | 0 |
| వరపరీక్ష | ... | ... | 0 | 8 | 0 |
| మధుకీల | ... | ... | 1 | 0 | 0 |

నవ్య సాహిత్య పరిషత్తు: గుంటూరు.